ఓం.

# వేదసంగ్రహము

ఇది

వేదములయందలి విషయములు సర్వజనులకు తెలియుట
కు తెలుగున సంగ్రహముగా

శ్రీమత్పరమహంస,

## గోపాలసచ్చిదానంద

## బ్రహ్మేంద్ర సరస్వతీస్వాముల,

వారిచే శ్రీవిద్యనుకూడా చేర్చి రచియింపబడి,

మహారాజరాజశ్రీ పర్వతనేని చినకామయ్య
గారి ద్రవ్యసహాయముచే,

నూజవీడు తిరువూరు వెంకటాద్రిగారి
శ్రీగౌరీముద్రాక్షరశాలయందు ముద్రించి,
గాడేపల్లి చంద్రశేఖరరావుగారిచే కొల్లూరు
గ్రామములో ప్రకటింపబడినది.

**1917.**

వెల రు 0-2-0.

# ప్రకటన.



ఆర్యులారా!

వేదము. ఋగ్యజుస్సామాథర్వణములని వినుచుండుటతప్ప. వేదమందలి విషయములు దేశమందు బహుజనముకు తెలియకుండుట లోకవిదితము, లౌకికవిద్యాధిశులు వేదములందలి విషయములు ఛాందసములనిన్ని. కించద్విద్యాపరులు. జనసామాన్యమునకు పనికి రావనిన్ని వైదికవిద్యాపరులు. భాష్యసహితముగా చదువుటలేనందున జనసామాన్యమునకు పనికిరావనిన్ని యెంచుట చూచి వేదము లౌకిక వైదికప్రపంచనమునకు యావత్తుకు (అనగా యెల్లజనులకుగల ఆవశ్యకతను లోకమునకు వెల్లడిచాయనెంచి సంగ్రహముగా నాల్గువేదములయందలి విషయములను తెలుగున ప్రకటించినారము.

10–9–17,
మకాం,
ఈడుపుగల్లు.



శ్రీమత్పరమహంస,



జి. యస్. ఎ. సరస్వతీ




# వేదసంగ్రహము.

వేదము విత్. ధాతువునుండి ఈశబ్దము పుట్టినది. వేదనగా జ్ఞానము. వేదమువలన ధర్మాధర్మములు తెలియును. వేదములు భగవదుక్తములు. ఈశ్వరుడు నిరాకారుడని శ్రుతులుచెప్పుచుండ నిప్పుడు వేదములు ఈశ్వరోక్తములనుచున్నారే నిరాకారుడగు ఈశ్వరుడెట్లు మానవులకు వేదములనిచ్చెను. ఈశ్వరుడు తనయొక్క శ్వాసనే వేదమంత్రములగ జేసి అగ్న్యాదిఋషుల ముఖములను లోకమునకు ప్రకాశింప జేసెను. ఇందుకు శ్రుతిస్మృతిప్రమాణములుచూపుదుం.

అస్య మహతో భూతస్య నిశ్వసితమేతద్యదృగ్వేదో యజుర్వేదస్సామవేదోऽథర్వాఙ్గిరస ఇతి శ్రుత్యా పరమాత్మనో నిశ్వసితమేవ వేదా ఇతి శ్రూయతే. సూ. శాస్త్రయోనిత్వాత్. వే. ౧. అ. ౧ పా. 3. సూ.

అప్రాణో హ్యమనాశ్శుభ్రః యను శ్రుతిరీత్యా కర చరణములు లేని ఈశ్వరునికి శరీరప్రాణ సంబంధమైన శ్వాసవచ్చుటనుండి కలుగుననినచో, అపాణిపాదో జవ

నోగృహీతా పశ్యత్య చక్షుస్సశృణోత్యకర్ణః అగ్నిర్మూర్ధా చక్షుషీచంద్ర సూర్యౌదిశశ్రోత్రే వాగ్వివృతాశ్చ వేదాః. ఇటువంటి జాతీయకమైన శృతులచే పరమేశ్వరునికి మూర్తిమత్వము లేకపోయినను స్వమహిమచే లోకానుగ్రహార్థం వాగూపముగా వేదము ప్రకాశపరచుటమైనది. అందుచే పూర్వపక్షస్థమైన శంకకవకాశము కలుగజాలదు. మరియు ఒకరాజుతన రాజశాసనమును ఉత్తములగు మంత్రులద్వారా వెల్లడిపరచునుగదా అలాగే ఈశ్వరుడు వేదమును అగ్ని, వాయు, ఆదిత్య, అంగీరసులను ఈనలుగురు ఋషులమూలముగా వెల్లడిపరచెనని సిద్ధమగుచున్నది. అందరిజీవులకంటె ఈనలుగురు జీవులే మిక్కిలి పవిత్రాత్ములుగనుండిరి. ఇందుకు ప్రమాణములనుజూడుడీ.

ఋగ్వేద ఏవాగ్నేరజాయత యజుర్వేదో వాయోః సామవేద ఆదిత్యా దైతరేయ బ్రాహ్మణపంచకమ్. ఐతరేయ బ్రాహ్మణమ్ 3_౨.

అగ్నే ఋగ్వేదో వాయోర్య జుర్వేదః సూర్యాత్సామవేదః. శతపథబ్రాహ్మణమ్. ౧౧. ౪. ౨. 3.

శ్లో॥ అగ్నివాయురవిభ్యస్తుత్రయం బ్రహ్మసనాతనం.

దుదోహయజ్ఞసిద్ధ్యర్థమృగ్యజుస్సామలక్షణమ్.

మనుస్మృతిః. ౧. అ. ౨౩

యేదేశభాషయందైనను ప్రకాశపరచక వేదములను సంస్కృతమునందే ప్రకాశపరచుట ఈశ్వరునికిపక్షపాతము కాదాయనినచో దేశభాషలలో దేనిలోనైనను ప్రకాశపరచుట పక్షపాతముగా నుండును. ప్రపంచమునకంతటికిని సమానమైన సంస్కృతభాషలో వేదములనిచ్చియుండుటవలన నిష్పక్షపాత మేర్పడుచున్నది. యేలననగా సంస్కృతము యేదేశభాషయును గాదు. దానియందందరికిని స్వాతంత్ర్యము కలదు. యొకదేశమునకు గాని యొకకులమునకుగాని యొకజాతికిగాని బొత్తిగా సంబంధము లేనిది. అందరు దానిని ప్రయత్నపూర్వకముగా సభ్యాసము చేయవలయును. అన్నిభాషలు దీనినుండిపుట్టినవి. గాన ఈశ్వరుడు నిష్పక్షపాతి. సంస్కృతము పరమేశ్వరుని కృపవలన కలిగినందున దానికి దేవభాషయని పేరుకలిగినది. వేదము నిత్యమైనది. వేదము బ్రహ్మయొక్క నాలుగుముఖములనుండి నాలుగు భాగములుగాననగా ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథ

ర్వణవేదము అను నీనాలుగువేదములు కలిగెనని చెప్పబ
డియున్నదే? అవి మిథ్యయేనాయనినచో అంతయేగాదు.
ఒకచోట యజ్ఞమునుండి వేదములు కలిగెననియు, మరి
యొకచోట ఇంద్రునినుండి ఉత్పత్తియయ్యెననియు, వేరొ
కచోట కాలమునుండియనియు, మరొకస్థలమునందు స
ముద్రమునుండి వేదములు త్రవ్వబడెననియు, వేరొకచో
ట ప్రజాపతియొక్క వెంట్రుకలే వేదములనియు, ఇంక
నొకచోట సరస్వతినుండి వేదములు వెడలెననియు, నా
నాచోట్ల నానావిధములుగా మతాంతరులవలన చెప్పబడి
నది. ఈమిథ్యాకల్పన ప్రభావముచేత తుదకు వేదములు
నయితము కల్పితమని యీ లోకులు భ్రమించవలసివచ్చిన
ది. అగ్న్యాదిఋషులనుండి బ్రహ్మాదిఋషులు వేదముల
నభ్యసించిరి. వారిలో బ్రహ్మ నాలుగువేదములను కంఠ
స్థము చేసినందున అతనికి చతుర్ముఖుయని బిరుదుకలిగిన
ది. ఇట్టివేదములతో మనకావశ్యకత యేమియున్నదనిన
చో మనమొక అంధకారమయమైన స్థానాంతరమునకు
వెళ్లుటతటస్థించినప్పుడు మార్గమునందు భయదాయకమగు
కారణము లేకపోయినను చిత్తము భయాక్రాంత మగు

చుండును. అట్లుగాక ప్రకాశమైన మార్గమున ప్రయాణ
ము చేసితిమేని భయకారణములు వాస్తవముగా నున్న
ప్పటికిని చిత్తమునకు భయముతోచదు. ఈదృష్టాంతము
వలన మానవునకు అజ్ఞానమువలనభయము జ్ఞానము వల
న నిర్భయము ఈరెంటితోను కూడియుండునని సిద్ధాం
తమగుచున్నది వేదమనగా జ్ఞానమని యిదివరకే చె
ప్పియున్నారము. ఏరాజ్యముగాని రాజశాసనమును శి
క్షా విధానమును లేనియెడల నది నిర్వాహము కాజా
లదు. పరమేశ్వరుడు తన అనంత రాజ్యమునకు తగిన శా
సనమును రాజు తన రాజ్యమందలి ప్రజల మేలుకొరకె
ట్లు శాసనమును విధించునో అట్లు వేదశాసనమును ప్ర
చురించి యున్నవాడు. ధర్మార్థ కామమోక్షములకు
జ్ఞానమే ముఖ్యకారణము. అట్టిజ్ఞానములేకుండా ధర్మా
ర్థకామ మోక్షములను చతుర్విధ పురుషార్థములు ప్రా
ప్తించవు వేదమును చదువక జ్ఞానములభింపదు కాబ
ట్టి వేదము పురుషార్థదాయకమైనది. ముఖ్యముగా మా
నవులకు ఆవశ్యకమైనది వేదము. వేదములందేమిగల
దనిచో మానవులు చేయదగిన ధర్మార్థ కామమోక్ష

ములకు అనుకూలమగు జ్ఞానమునులేక సమస్తవిద్యలకనుకూలమగు జ్ఞానమునుకలదు. ఇట ఉదాహరణముగా కొన్ని చూపుదుము.

ఋగ్వేదము.

మండలం. ౨. సూక్తం ౩. మంత్రం ౬. బట్టలునేయువిద్య ౩. ౫౩. ౧౯. బండ్లు, రథములు లోహపు పనులు చేయుట. ౫. ౯. ౫. లోహపు పనుల విధానములు. ౬. ౩. ౪. బంగారుపని ౧. ౧౪౦. ౧౦. ౨. ౩౯. ౭. ౭. ౫౩. ౨. యుద్ధవీరులకు కవచములు చేయుట ధరించు లక్షణాదులు ౪. ౩౪. ౯. భుజకవచముల విధానములు. ౨. ౩౪. ౩. బంగారము త్రవ్వి యెత్తెదు విధానము ౬. ౪౬. ౧౧. సేనావ్యూహముల విధానము, సంగ్రామవిధానము, రథవిధానములు ౨. ౪౧. ౫. ౬. ౨౬. ౨౯. ఉత్తమస్థానముల నిర్మించు విధానము ౪. ౪. ౧. రాజపురుషులు యేనుగులుపై స్వారిచేయువిధానము ౪. ౫౮. ౧. ౭. వరకు, కృషివిద్య ౧౦, ౧౦౧. ౩, ౮, బావులు త్రవ్వుట, నాగలిచేయుట, విత్తనములుచల్లుట మొదలగువి

ధానములు ౧౦. ౨౫. ౪. నూతులు త్రవ్వినట్టి విధాన
ము ౧౦. ౯౩. ౧౩. బావులనుండి నీరుతోడి పైరులకు
పారించువిధానము ౧౦ ౯౯. ౪. ౫. ౨౭. ౨.౮౦
గానునాళ్యములుచేయు విధానము ౧. ౨౭. ౨. సము
ద్రముపై ఓడల నడుపువిధానము ౪. ౫౫. ౬. పరదేశ
ములకు సముద్ర యాత్రచేసి ధనమార్జించు విధానము
౨. ౭. ౧౬. ౧. ౧౧౭. ౧౩. ౧. ౧౧౯. ౧౫. ౧.
౧౧౬. ౧౬. ఆయుర్వేదవిధానము ఔషధవిధానము,
శల్యవిద్య. విరిగిన అంగముల చికిత్సాది సాధనములు
౧. ౧౯. ౧౬ గ్రుడ్డివారికి కృత్రిమకన్నులు ధరింప జే
యువిధానము ౧౦. ౮౫. ౧౩. ౧. ౧౯౪. ౧. ౪౮.
నక్షత్రవిద్య. చంద్రగతి. ఋతువుల యొక్క పరివర్తన
మునకు కారణము సూర్యుడని ఋతువర్ణన. వర్షము. అ
యనము, మాసవిషయములు ౧. ౨౫. ౮. కాలనిర్ణ
యము. ద్వాదశరాసులయొక్క వర్ణనమునుగూర్చి ౧.
౨౪. ౮. ౧. ౪౧. ౪. ౧౦. ౮౫. ౧. ౫. ౪౫. ౭.
౮, ౧. ౧౬౪. ౧౧. ౧. ౧౧౦. ౨. ౧౦. ౮౯. ౪.
వీట్లయందు చెప్పబడియున్నవి. ౧. ౧౧౦. ౨. ఆయన

ములయొక్కకీలు సూర్యగోళము ఆకర్షణయొక్క వర్ణన ౧. ౨౮. ౧౦. సప్తర్షి నక్షత్రముల వర్ణన ౫. ౪౦. పూర్ణిమా సూర్యగ్రహణాదులవర్ణన విధానము. ౧. ౧౬౧. ౧౩. జ్యోతిషమందు (ఖగోళవిద్య) వేదమునందు రైలును టెలిగ్రాముచేయునట్టి విద్యలు గలవాయని యనకైనను ప్రశ్నించెదరేని నిస్సందేహముగ [illegible] లము. ఈవిషయములన్నియు భాష్యములవలన తెలియుదగియున్నవి అయినను అడుగుదురేమోయని చూపదలచి జూపుచున్నారము. ఋగ్వేదములోనుండు నీక్రిందివాక్యములనుచూడుడీ.

౧ తుగ్రోహభుజ్య మశ్వినోదమేఘే.

౨ తిస్రఃక్షపస్త్రిరహాతివ్రజ.

3 అనారంభణే తదవీరయేథా ౪ యమశ్వినాదదథుః శ్వేతమశ్వ ౫ త్రయః పవయో మధువాహనేరథే ౬ త్రిర్నో అశ్వినాయజతాదివే 2 ౭ ఆరిత్రంవాది వస్త్రధుతే ౮ వియెభ్రాజంతేసుమఖాస ౯ అనోనావామతీనాం యాతం ౧౦ కృష్ణంనియానం హరయః ౧౧ ద్వాదశప్రధయశ్చక్రమేకంత్రీణి.

వెండియు ఈక్రిందవ్రాయుమంత్రమునందు నావిమానాదివిద్యలు చెప్పబడియున్నవి.

యువం పేదవేపురూవా రమశ్వినా.

అను మొదలగుమంత్రములో టెలిగ్రాఫ్ చేయువిధమున్నది

యజుర్వేదము.

పరీత్య భూతాని అ. ౩౨. మంత్రము. ౧౧.

బ్రహ్మవిద్య శ్రద్ధృష్ట్వారూపే. ధృతేధృంహా అగ్నేవ్రతప తే వ్రతేనదీక్షా అ ౧౯ మం ౭౭ అ ౩౬ మం ౧౮ అ ౧ మం ౫. అ. ౧౯. మం. ౩౦ వీట్లయందుధర్మవిషయము చెప్పబడియున్నది. సహస్రశీర్షః పురుషఅను మంత్రము మొదలుకొని శ్రీశ్చతేలక్ష్మీశ్చ. మంత్రమువరకు ౨౨ మంత్రములు. అ. ౩౧. మం. ౧. ౨౨. సృష్టివిద్య. అయంగౌః. అ. ౯. మం. ౬. పృథివ్యాది లోకభ్రమణ విషయము. ఆకృష్ణేనరజసా. అ. ౩౩. మం. ౪౩. ఆకర్షణాను కర్షణవిషయము. కృసిదేకాకీచరతి. సూర్యఏకాకీ చరతి. అ. ౨౩. మం. ౯. అ. ౨౩. మం. ౧౦. ప్రకాశ్యప్రకాశక విషయము. ఏకాచమేతి స్రశ్చమే. చతస్రశ్చమేష్టౌచ ఇయంవేదిః పరో, అ. ౧౮. మం. ౨౪.

౨౫. అ. ౨౩. మం. ౬౨. గణితవిద్య. పునర్మనః పున రా. ద్వేసృతీ అశృణవం. అ. ౪. మం. ౧౫. అ. ౧౯. మం. ౪౭. పునర్జన్మవిషయము. క్షత్రస్య యోనిరసీ మొదలుకొని త్రాతారమింద్ర మవితార మింద్రమను మంత్రమునరకు అ. ౨౦. మం. ౧. ౨౫. ౩. ౪. ౫. ౭. ౮. ౧౦. ౫౦. ౪౦. రాజప్రజాధర్మ విషయము. పూషణం వసిష్ఠు నా మొదలు ఇంద్రస్య క్రోత్రోది త్యేపాజస్యం వరకు ౮ మంత్రములు అ. ౨౫. మం. ౧. ౮. శారీర శాస్త్రము

## సామవేదము.

ఇందు ఈశ్వరభక్తిస్తుతి మొదలగు బ్రహ్మవిద్యవరకు గల విషయములున్నవి.

## అధర్వణవేదము.

మహద్యక్షం భువనస్య. ౧. కాండ. ౨౩ ప్రశ్న ౪ అనువాకం ౩౮ మంత్రమున ద్వితీయోన తృతీయశ్చ ౧౩ కా ౪ అ. ప్ర ౨౩ మం ౧౬ నపంచమోన షష్ఠః ౧౩ కా ౨౩ ప్ర ౪ అ ౧౭ మం నమిదం నిగతం ౧౩ కాం ౨౩ ప్ర ౪ అ ౧౮ మం సర్వేఅస్మిన్ దేవాః ౧౩

కా. ప్రశ్న ౨౩ అ ౪ మం ౨౦. ౨౧ ఈమంత్రములు బ్రహ్మవిద్యనుగూర్చి చెప్పబడుచున్నవి. యత్పరమ మవమం దేవా పితరో మనుష్యాః. ౧౦. ౧౧ కాం ౨౩ ౨౪ ప్ర ౪. ౪ అ ౭. ౨౭ మం సృష్టివిద్య అష్టా వింశాని శివాని మొదలుకొని ౧౩. ౧౯ కాం ౨౪ ప్రశ్న ౧ ౪ అ ౨. ౪౭ ౪౮. ౪౯. ౫౦. ౫౧. ౫౨. ౫౩. వరకు ఉపాసనావిధినిగూర్చి చెప్పబడుచున్నది. ఆచార్య ఉపనయమానో ఇత్యాది ౧౩ కాం ౨౪ ప్ర ౪ అ ౫౩ బ్రహ్మచర్యవిధి సాయం సాయం గృహపతిర్నో ఇత్యాది పూర్వోక్తరీత్యా పంచమహాయజ్ఞవిధిః ప్రాచీదిగగ్నిరధిపతి ఇత్యాదిపూర్వోక్తరీత్యా భగవత్ప్రార్థనావిధిః. ఇందో్రజయాతినపరాజయాతా. ఇత్యాది పూర్వోక్తరీత్యా రాజధర్మవిధిః. ఇయం నారీపతిలోకం వృణానా ఇత్యాది పూర్వోక్తరీత్యా నియోగవిధిః.

మెండియు ౧ కౌశికసూత్రము ౨ వైతానసూత్రము ౩ నక్షత్రకల్పము ౪ అంగీరసకల్పము ౫ శాంతికల్పము ఈఅయిదుసూత్రముల ననుసరించి విద్యారణ్య భాష్యానుసారము విశేషించిన ఉపయోగ విధులను చెప్పు

చున్నాము.

మనదేశములో నథర్వవేదప్రచారము లేదు గాన దానివిషయముల నరయుటకు నీకల్పములోని విశేషముల ను దిజ్మాత్రముగ నిందు బొందుపరచెదము. కౌశికసూత్రములో మేధాకర్మ మొదలు అధ్యయనవిధివరకు ౧౨ కర్మలుప్రతిపాదింపబడెను. స్థాలీపాకవిధానము చేతదర్శపూర్ణమాసవిధి. తర్వాత మేధాజనన కర్మలు. బ్రహ్మచారి సంపత్తును కలుగు జేయుకర్మలు. గ్రామ నగర దుర్గ రాష్ట్రాదిలాభార్థకర్మలు పుత్ర పశు ధన ధాన్య ప్రజా స్త్రీ కరి తురగ రథాందోళికాది సర్వసంపత్సాధక కర్మలు జనులకు నైకమత్యము మనోల్లాసము కలుగజేయు కర్మలు పిదప రాజకర్మలు యుద్ధజయసాధనములు ప్రయుక్త బాణములను నివారించు మంత్రములు ఖడ్గాదిసర్వశస్త్ర నివారణమంత్రములు పరసేనలను మోహనోద్వేషన స్థంభనోచ్చాటనాదులొనరించు మంత్రములు స్వసేనకునుత్సాహరక్షణాభయము లొసంగు మంత్రములు యుద్ధమందు జయపరాజయములను బరీక్షించుమంత్రములు సేనాపతి మొదలుగాగల ప్రధానపురుషులను జయించుకర్మలును శత్రు

సేనాసంచార ప్రదేశములందు పాశాశకశలభి మంత్రించి వేయు మంత్రాదులు జయాపేక్షగలరాజు రథమునెక్కుటయు భేరీపటాదులగు సర్వవాద్యములను అభిమంత్రించి వాయించుట శత్రువులను నాశనమునుచేయుకర్మలు శత్రుసంహరణానంతరము రాజుతిరిగి తనదేశము ప్రవేశించుట రాజ్యాభిషేకము మొదలగు పాపక్షయకర్మలు అనగా నిబుక్తదేవతనుగూర్చి చేయుకర్మలు చిత్తాసక్షత్రయుక్తకర్మలు పుష్టికలుగజేయుకర్మలు ఆవులను వృద్ధిజేయుకర్మలు సంపత్కరకర్మలు పుష్ట్యర్థమణి బంధనములు వ్యవసాయాభివృద్ధిమంత్రములు ఎడ్లను వృద్ధికలుగజేసుకొను కర్మలు గృహవృద్ధికర్మలు నూతనగృహ నిర్మాణాదికర్మలు వృషోత్సర్జనకర్మలనగా ఆబోతునువిడుచుట అగ్రహాణీయకర్మ జన్మాంతర కృతపాపములవల్లగలిగి ఆవుషధముచేసాధ్యముకాని వివిధ రోగముల బోగొట్టు మంత్రానుష్ఠానముల విషయమేమన్నను సర్వవ్యాధులకు నౌషధ రూపములగు కర్మలు జ్వరాతిసారబహుమూత్రాదులకు మంత్రములు శస్త్రాదులవలన గాయమై నెత్తురుకారగా దానినిరోధించు మంత్రములు భూతప్రేత పిశాచాపస్మారబ్ర

బ్రహ్మరాక్షస బాలగ్రహములను నివారించుమంత్రములువా తపిత్తశ్లేష్మ నివారకమంత్రములు హృద్రోగకామిలాశ్విత్ర నివారకమంత్రములు సంతతజ్వరము పట్టువిడుపు జ్వరములు మొదలగు విషజ్వరములకు క్షయజలోదరములకు నివారకమంత్రములు పశ్వాదుల క్రిమిరోగనివారకములు గండమాల సర్ప వృశ్చిక స్థావరజంగమ విషనివారకమంత్రములు దేహసర్వాంగరోగ నివారకములు బ్రహ్మశాదిశాపవిమోచములు గండమాలాదిరోగ నివారకమంత్రములు పుత్రాదికమందు కోరికగల స్త్రీలుచేయు కర్మలు. సుఖప్రసవకర్మలు గర్భాదానగర్భవృద్ధి పుంసవనాది కర్మలు సౌభాగ్యమునిచ్చు కర్మలు రాజాములకోప నివారకమంత్రములు కోరికసిద్ధించునా లేదాయని కనుగొను మంత్రములు దుర్దినములను పిడుగులను అతివృష్టిని నివారించుకర్మలు సభయందును జయవివాద యందును జయమును కలహశమనమును గలుగుజేయుకర్మలు స్వేచ్ఛతో నదీప్రవాహమునుజేయు కర్మలు వర్షము పుట్టించుకర్మలు ధన నిక్షేపముల వెదుకు కర్మలు. ద్యూతమందు జయకర్మ ఆవుదూడకు పాలునియ్యకుండిన దానినివారకమంత్ర

ము అశ్వశాంతి వ్యాపారమందు లాభముకలుగఁజేయుక
ర్మ గృహమందు కపోతవాయసాదులు పడినచో చేయువ
లసినకర్మ దుష్ప్రతిగ్రహము అయాజ్యయాజనాదిదోష
మును నివారించుకర్మలు దుఃస్వప్ననివారణమంత్రము కు
మారుండు పాపనక్షత్రమున పుట్టినచో జేయవలసినకర్మ
ఋణవిమోచనకర్మ దుశ్శకునశాంతి దయ్యాల మంత్ర
ము ఇతరులుచేసిన శాతపడికి నివారణమంత్రము క్షేమ
కరకర్మలు ఆయుర్వృద్ధిమంత్రములు జాతకర్మ నామకర
ణ చూడాకరణోపనయనాది కర్మలు పశాగ్నియందు చే
యబడు కామ్యకర్మలు బ్రహ్మౌదన స్వర్గౌదనాది [illegible]
సవయజ్ఞములు రాక్షసబాధ నివారక మంత్రములు ఆవస
థ్యాధానము వివాహము పితృమేధకర్మలు పిండపితృయ
జ్ఞములు మధుపర్కము పాంసురుధిరాదివర్షణ యక్షరా
క్షసాది దర్శనభూకంపధూమకేతు చంద్రార్కోపప్లవాది
బహువిధోత్పాతములకు శాంతికర్మలు ఆజ్యతంత్రవిధి అ
ష్టకాకర్మ ఇంద్రమహాకర్మ తదనంతరము అధ్యయనవిధి.

ఋగ్యజుస్సామవేదములందు జెప్పబడిన దర్శపూ
ర్ణమాసములు మొదలుకొని అయునాంతముగాగల కర్మ

లందు బ్రహ్మ బ్రహ్మణాచ్ఛంసీ అగ్నీధ్రుడు హోత ఆ
ను యీనలుగురు ఋత్విక్కులుచేయవలసి కర్మ వైతాన
సూత్రమందు జెప్పబడుచున్నవి. అనుజ్ఞఇచ్చుట మంత్ర
మునననుసరించి చెప్పట మొ॥ బ్రహ్మకార్యములు బ్రాహ్మణా
చ్ఛంసికి శస్త్రములు అగ్నీధ్రునకు అన్వాహార్యమందువం
డుటకుంచబడిన యాజ్యాదులు. హోతకుంచబడిన ఆ
జ్యాదులు ఇటుల విభాగము అందులో కర్మక్రమమీలా
గు నున్నది. ప్రథమమందు దర్శపూర్ణిమాస క్రతువులు
రెండసగా అమావాస్యపూర్ణిమనాడు చేయు కర్మలు పిత
పంగ్యాధానము. అగ్నిహోత్రము ఆగ్రయణేష్టి చా
తుర్మాస్య వైశ్యదేవవరుణ. ప్రఘాస, పాకమేధ, శునా
సీరీయకర్మలు, పశుయాగము, అగ్నిష్టోమము, ఉక్థ్య
ము, షోడసి, అతిరాత్రము, ప్రకృతిగాగల నాలుగుసం
స్థలుగల సోమయాగము, వాజపేయము, అప్తోర్యామ
ము. అగ్నిచయనము సౌత్రామణి మైత్రా వరుణ్యామి
క్షేష్టి, గవామయనము, రాజసూయము, అశ్వమేధము.
పురష మేషధము, సర్వమేధము, బృహస్పతి సవన గోస
వనాదులు, ఏకాహాములు, సోమయాగములు, పుష్టి,

లకు గాయత్రీ. తానుఅభిచారకర్మను జేయునప్పుడుగా
ని లేక ఇతరులుచే ప్రయోగము చేయబడినప్పుడుగానిసం
పత్కామునకు ఆంగీరసశాంతి. విజయబలపుష్టి కామున
కు పరరాజ్యము గష్టపెట్టునట్టి ప్రయత్నమొనర్చువానికి
ఐంద్రీశాంతి. అద్భుతమైన వికారమును నివారణజేయ
నిచ్ఛగలవానికి రాజ్యకామునకు మాహేంద్రశాంతి. ధన
కామునకు ధనక్షయనివృత్తికామునకు కౌబేరీ శాంతి.
విద్యాతేజోబోధనాయుష్కామునకు ఆదిత్యశాంతి భూతికా
మునకు వాస్తుసంస్కారకర్మశేయువానికి వాస్తోష్పతిశాం
తి రోగార్తునకు. ఆపద్గ్రస్తునకు రౌద్రి విజయ కామునకు
అపరాజితయును. భయముగలవానికి యామ్య. జలభీతున
కు వారుణి. వాతభీతునకు వాయవ్య. కులక్షయనివృత్తి
కై సంతతియనుశాంతి. వస్త్రక్షయనివృత్తికొఱకు త్వా
ష్ట్రీ. బాలునివ్యాధినివృత్తికొఱకు కౌమారి. నిఋృతివల్ల
పీడబడినవాడు నైఋతి. బలకామునకు మారుద్గణి. అ
శ్వక్షయనివృత్తికొఱకు గాంధర్వి. గజక్షయనివృత్తికొఱ
కు పారావతి. భూకామునకు పార్థివ. భయార్తునకు అ
భయమనుపేరుగల మహాశాంతి. ఈశాంతులతో తంత్ర

భూతమగు మహాశాంతిగూడ జేయవలయును.

ఆంగీరసకల్పమునందు అభిచారకర్మాదులును జేయువానికి సభికులకు రక్షాకరణము. అభిచారమున కుపయుక్తములైన దేశకాలమండపకర్తృకారయితృ దీక్షాది ధర్మములను సమిదాజ్యాది సంభారములను నిరూపించుట మొదలైనవి. పిదప చాతబడికర్మలు ఇతరులుజేయు శాతపడికర్మల నివారణములు ఇంకయు నితరకర్మలు.

శాంతికల్పమునందు గూడ మొదట వైనాయకగ్రహముచే బట్టుబడినవానియొక్క లక్షణము తచ్ఛాంతికై సంభారములదెచ్చుట అభిషేకము వైనాయక హోమములు వానిపూజావిధానములు. ఆదిత్యాది నవగ్రహయజ్ఞాదికములు చెప్పబడినవి. ఈపంచకల్పములయందు జెప్పబడక పరిశిష్టములో నుదాహరింపబడిన రాజాభిషేకోపయుక్తకర్మలుగూడా నీభాష్యమందు వ్యక్తీకరింపబడియున్నది. మొదట రాజాభిషేకము ప్రతియుదయమున పురోహితుండు రాజునకు ఆయామంత్రములచే నభిమంత్రించి యిచ్చిన వస్త్రగంధాలంకార సింహాసనాశ్వగజాందోళికా ఖడ్గధ్వజచ్ఛత్ర చామరాదుల సంబంధము

లైన పురోహితకర్మము. రాజుప్రతిదినమియ్యవలసినదానాదులు. పూజితమైన పిండితో జేయంబడిన రాత్రియను బొమ్మతో రాజునకు ఆరతియిచ్చుట రక్షాకరణము మొదలగు పురోహితునిరాత్రి కర్మలు రాజునకు పుష్యాభిషేకము రాత్రియందు రాజునకు ఆరతిక్రమవిధము. ప్రతిదినమందు నేతిలో ముఖము జూచుట కపిల గోపోషణాదికము హిరణ్యగర్భవిధి మరియు ననేకకర్మలు రాజునకు జేయువిధులు. పై జెప్పబడినకర్మలు నిత్యనైమిత్తికకామ్యములని మూడు తెరంగులు వానిలో జాతకర్మాదులు నిత్యములు దుర్దినాశనినివారణాశ్వశాంత్యాద్భుత కర్మాదులు నైమిత్తికములు మేధాజననగ్రామ సాంపదాదులు కామ్యములు చేయనిచో ప్రత్యవాయస్మృతి భీతిచే నిత్యనైమిత్తికములవశ్య మనుష్ఠేయములు. కామ్యములు కోరికననుసరించును. ఈకర్మలన్నియు నగరి బైట తూర్పున గాని యుత్తరమునగాని మహానదీతటాకాద్యుత్తర కూలమందు అనుష్ఠింపనగునని కౌశికసూత్రము జెప్పుచున్నది. పుంసవనాదులగు నిత్యకర్మలు ఇంటిలో జేయనగునని రుద్రభాష్యకార మతము. వానిపుణ్యకాలము పూర్వద్వ

యు రోగము పుణ్యనక్షత్రము లేక తిథి అద్భుతకర్మలు వాని నిమిత్తానంతరమే చేయనగు అభిచారకర్మలప్రయోగము ఊరిబైట దక్షిణదిక్కున కృష్ణపక్షమందు కృత్తికానక్షత్రమందు జరుపనగు ఈకర్మల ప్రాగుదచ్యాంగములు దర్శపూర్ణిమాసములవలె జేయబడవలయును. అథర్వణకర్మ ఆజ్యతంత్రము పాకతంత్రము అనిద్వివిధము. ప్రధానమగు హవిస్సుచే జేయబడినకర్మలు ఆజ్యతంత్రము చరుపురోడాశాదికముతో గూడినది పాకతంత్రము ఇటులు సోపస్కారముగ సుబోధాతమందు సాయణాచార్యులును విద్యారణ్యులును వ్రాసియుండుటయేగాక.

శాఖాయాః శౌనకీయాః పూర్వోక్తేష్వేవ కర్మసు
వినియోగాభిధానేన సంహితార్థః ప్రకాశతే.

అని ప్రతిజ్ఞాపూర్వకముగ సంహితాభాష్యము నుపక్రమించిరి. ఈభాష్యశైలియతిలలితము. కీరునుమీరియున్నది దీనిపాకము ద్రాక్ష. ఇది వ్యాకరణ కోశకాది సూత్రపూరితము. ఈయథర్వణవేదమందు ౫౦ ఉపనిషత్తులున్నవి. ప్రశ్నముండకములు సగుణనిర్గుణ బ్రహ్మప్ర

తిపాదకములు. నృసింహతాపిని మాండూక్యమునకు వ్యాఖ్యానరూపముగ బ్రణవవిశేషంబులు విశేషములుగలది. ఇతరఉపనిషత్తులు బ్రహ్మవిద్యయనబడు శ్రీవిద్యా విశేషములు గలిగియున్నవి. అవియోగులకు మాంత్రికులకుగడునుపాదేయములు.

కాబట్టి వేదము సమస్త సత్యవిద్యలుగల గ్రంథము. సత్యమునుగ్రహించుటకును అసత్యము నుత్యజించుటకును వేదమే ఆధారము. ఈశ్వరుడు సర్వజ్ఞుడగనుక అతనికి తెలియని విద్యలులేవు. గావున వేదము అన్నివిద్యలతో కూడియున్నది. వేదమతిమే మనుష్యులకు ముఖ్యమతము. వేదమందలి ధర్మములే మానవుల కందరికి పరమధర్మములు వేదకర్మలే లోకులందరికిని ఆచరణీయము. వేదమందు అసంభవమైన కధలుగాని మానవచరిత్రలుగాని మతమతాంతర సిద్ధాంతములుగాని పక్షపాతముగాని అన్యాయముగాని యెంతమాత్రము లేదు. వేదము ఈశ్వరీయజ్ఞానము. ఇట్టివేదములు అభ్యసించుటచే యూరోపఖండ వాసులు తుల్యములేని ఐశ్వర్యములను అనుభవించుచున్నారు.

ఓ ఆర్యులారా మీరునూ మీసంబంధములగు వేదములను అభ్యసించి తఱలేని సకలైశ్వర్యములను బొందుటకై మహారాజరాజశ్రీ పర్వతనేని చినకామయ్యగారి ప్రోత్సాహ ద్రవ్యసహాయములచే సర్వజనులకు వెల్లడియగుటకు మాచే ప్రకటించుటయైనది.



10-9-17, మకాం, ఈడుపుగల్లు. } శ్రీమత్పరమహంస, ☞ జీ. యస్. బి. సరస్వతి.





# శ్రీ విద్యా.

౧ అస్యశ్రీసౌభాగ్య విద్యారాజరాజేశ్వరీ అగ్గళమహా
మంత్రస్య బ్రహ్మాఋషిః. గాయత్రీచ్ఛందః. సౌభాగ్య
విద్యా రాజరాజేశ్వరీ దేవతా. ఐం. కఏఈలహ్రీంబీజం
క్లీం. హసకహలహ్రీంశక్తిః. సౌః సకలహ్రీం. కీలకం.
సౌభాగ్య విద్యారాజరాజేశ్వరీ ప్రసాద సిద్ధ్యర్థేజపే విని
యోగః. మూలేనషడంగన్యాస మరుణాం కరుణా మితి
ధ్యాన లమిత్యాదిపంచపూజాం కుర్యాత్.

నమోబ్రహ్మణే ధారణంమే అస్త్వనిరాకరణంధా
రయితాభూయాసం. కర్ణయోశ్రుతం మాచ్యోఢ్వం మ
మాముష్యం ఓం.

౨ అస్యశ్రీసౌభాగ్య విద్యారాజ రాజేశ్వరీ కీలకమ
హామంత్రస్య బ్రహ్మాఋషిః గాయత్రీచ్ఛందః. సౌభాగ్య
విద్యారాజరాజేశ్వరీ దేవతా. ఐంకఏ ఈలహ్రీంబీజం.
క్లీం హసకహలహ్రీంశక్తిః. సౌః సకలహ్రీం కీలకం సౌ
భాగ్యవిద్యారాజరాజేశ్వరీ ప్రసాదసిద్ధ్యర్థేజపేవినియోగః

మూలేన షడంగంన్యాస మరుణాం కరుణామితి ధ్యానలమిత్యాదిపూజాం కుర్యాత్.

అహం వృక్షస్యరేరివా కీర్తిః పృష్ఠంగిరేరివ ఊర్ధ్వపవిత్రోవాజినీవస్వ మృతమస్మి. ద్రవిణగ్ం సువర్చసంసుమేధా అమృతోక్షితః ఇతిత్రిశంకోర్వేదానువచనమ్

3 అస్యశ్రీసౌభాగ్య విద్యారాజరాజేశ్వరీ కవచ మహామంత్రస్య బ్రహ్మఋషిః. గాయత్రిచ్ఛందః సౌభాగ్య విద్యారాజరాజేశ్వరీ దేవతా. ఐంకఏఈలహ్రీం. బీజం క్లీం హసకహలహ్రీంశక్తిః. సౌః సకలహ్రీం కీలకం సౌభాగ్యవిద్యారాజరాజేశ్వరీ ప్రసాదసిద్ధ్యర్థేజపేవినియోగః

యశ్ఛందసామృషభో విశ్వరూపః చన్దోభ్యోధ్యమృతాత్సంబభూవ. సమేంద్రోమేధయాస్పృణోతు. అమృతస్యదేవధారణో భూయాసమ్. శరీరంమేవి చర్షణమ్. జహ్వామేమధుమత్తమా. కర్ణాభ్యాంభూరివిశ్రువమ్. బ్రహ్మణః కోశోసిమేధయాపిహితః. శ్రుతంమేగోపాయ ఆవహన్తీవితన్వానా కుర్వాణాచీరమాత్మనః. వాసాగ్ంసీమమగావశ్చ. అన్నపానేచసర్వదా. తతోమేశ్రియ మావహ లోమశాంపశుభిస్సహస్వాహా. ఆమాయన్తు బ్రహ్మచా

రిణస్వాహా. విమాయంతు బ్రహ్మచారిణస్వాహా. ప్రమాయంతు బ్రహ్మచారిణస్వాహా. దమాయంతు బ్రహ్మచారిణస్వాహా. శమాయంతు బ్రహ్మచారిణస్వాహా. యశోజనేసానిస్వాహా. శ్రేయాన్వస్య సోసాని స్వాహా. తంత్వా భగప్రవిశానిస్వాహా. సమాభగప్రవిశస్వాహా. తస్మింత్సహస్రశాఖే నిభగాహాం త్వయిమృజేస్వాహా. యథాపః ప్రవతాయంతి. యథామాసా అహర్జరం ఏవం మాం బ్రహ్మచారిణః. ధాతరాయంతు సర్వతస్వాహా. ప్రతివేశోసిప్రమాభావా ప్రమాపద్యస్వ వితన్వానాశమాయంతు బ్రహ్మచారిణస్వాహా. ధాతరాయంతుసర్వతస్వాహేతంచ.

౪ అస్య శ్రీసౌభాగ్య విద్యారాజరాజేశ్వరీ హృదయ మహామంత్రస్య బ్రహ్మఋషిః. గాయత్రీఛందః. సౌభాగ్యవిద్యారాజరాజేశ్వరీ దేవతా. ఐంకఏఈలహ్రీం. బీజం క్లీం హసకహలహ్రీం. శక్తిః. సౌఃసకలహ్రీంకీలకం సౌభాగ్య విద్యారాజరాజేశ్వరీ ప్రసాద సిద్ధ్యర్థేజపేవినియోగః.

మూలేనషడంగంన్యాస మరుణాం కరుణా వింతి ధ్యానలమిత్యాది పంచపూజాంకుర్యాత్.

యశ్ఛందసా మృషభో విశ్వరూపశ్ఛందో భ్యో
శ్ఛందాగ్స్యావివేశ. సచాగ్ంశిక్యః పురోవాచోప నిష
దింద్రోజ్యేష్ఠ ఇంద్రియాయ ఋషిభ్యో నమోదేవేభ్య
స్స్వధాపితృభ్యో భూర్భువస్సువశ్ఛంద ఓం.

॥ అస్యశ్రీసౌభాగ్య విద్యారాజరాజేశ్వరీ ధ్యజస్తోత్ర
మహామంత్రస్య బ్రహ్మఋషిః. గాయత్రీఛందః. సౌభా
గ్యవిద్యారాజరాజేశ్వరీ దేవతా. ఐంకఏ ఈలహ్రీం. బీ
జం. క్లీం హసకహలహ్రీం. శక్తిః. సౌః. సకలహ్రీం.
కీలకం. సౌభాగ్యవిద్యారాజరాజేశ్వరీ ప్రసాదసిద్ధ్యర్థేజపే
వినియోగః. మూలేన షడంగంన్యాశ మరుణాం కరుణా
మితిధ్యాన లమిత్యాది పంచపూజాంకుర్యాత్.

త్రియంబకం యజామహేసుగంధిం పుష్టివర్థనం.
ఊర్వారుకమివ బంధనాన్మృత్యోర్ముక్షీయమామృతాత్
ఏతేసహస్రమయుతం పాశామృత్యోర్మర్త్యాయ హంతవే.
1 తాన్యజ్ఞస్య మాయయాసర్వా నవయజామహే. మృత్యు
వేస్వాహా మృత్యువేస్వాహా. పాహినానాంగ్రింధి రసిరు
ద్రోమావిశాంతకః. తేనాన్ననాప్యాయస్వ నమోరుద్రా
యవిష్ణవేమృత్యుర్మేపాహి.

౬ అస్యశ్రీసౌభాగ్య విద్యారాజరాజేశ్వరీ పంజర మహామంత్రస్య బ్రహ్మఋషిః. గాయత్రీఛందః. సౌభాగ్య విద్యారాజరాజేశ్వరీ దేవతా. ఐం. కఏఈలహ్రీం. బీజం క్లీం హసకహలహ్రీం శక్తిః. సౌః సకలహ్రీం కీలకం సౌభాగ్య విద్యారాజరాజేశ్వరీ ప్రసాద సిద్ధ్యర్థేజపే వినియోగః.

మూలేనషడంగన్యాస మరుణాం కరుణామితిధ్యానలమిత్యాది పంచపూజాం కుర్యాత్.

తేవాచమాస్యార్ధద ఆమనస్యాగం హృదయాద ధియత్ర యత్ర తేవాజ్ఞితాతాంతత ఆదదే. యాంతిపరరాట్యాత నూర్మనోర్యగ్నధిస్య నాశనీ. తాం దేవాబ్రహ్మచారిణో వినయంతుసుమేధసః. యత్రపతన్ముఖే మతగుం రరాటముదివవిద్యతి పతేకోధన్నయామసి గర్భమశ్వతర్యాఇవ.

౭ అస్యశ్రీసౌభాగ్య విద్యారాజరాజేశ్వరీ మాలామహామంత్రస్య బ్రహ్మఋషిః గాయత్రీఛందః. సౌభాగ్య విద్యారాజరాజేశ్వరీదేవతా. ఐం కఏఈలహ్రీం బీజంక్లీం. హసకహలహ్రీం శక్తిః సౌః సకలహ్రీం.కీలకం. సౌభా

గ్యవిద్యా రాజ రాజేశ్వరీప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః.

మూలేనషడంగన్యాస మరుణాం కరుణామతిధ్యా సలషిఃత్యాది పంచపూజాంకుర్యాత్.

మేధా దేవిజుషమాణాన ఆగాద్విశ్వాచీ భద్రా సుమనస్యమానా. త్వయాజుష్టానుదమానాదు రుక్తాన్బృహద్వదేమ విదథేసువీరాః. త్వయాజుష్టా ఋషిర్భవతి దేవిత్వయా బ్రహ్మాగతశ్రీ ఋతత్వయా. త్వయాజుష్టశ్చిత్రం విందతేవసుసానోజుషస్వద్ర విణోనమేధే. మేధాంమ ఇంద్రోదధాతు మేధాందేవీ సరస్వతీ. మేధాం మే అశ్వినావుభావాధత్తాం పుష్కరస్రజా. అప్సరాసు చయామేధా గంధర్వేషు చయన్మనః. దైవీంమేధా సరస్వతీసామాంమేధాసుర భిర్జుషంతాం. అమాంమేధాసురభిర్విశ్వరూపా హిరణ్యవర్ణా జగతీజగమ్యా ఊర్జస్వతీపయసాపిన్వమానాసామాం మేధాసు ప్రతీకాజుషంతాం. మయిమేధాం మయిప్రజాం మయ్యగ్నిస్తేజోదధాతు. మయిమేధాం మయిప్రజాం మయీంద్రఇంద్రియందధాతు. మయిమేధాం మయిప్రజాం మయిసూర్యోభ్రాజోదధాతు స్వాహా.

౮ అస్య శ్రీసౌభాగ్య విద్యారాజరాజేశ్వరీ మహామంత్రస్య బ్రహ్మఋషిః. గాయత్రీచ్ఛదః. సౌభాగ్య విద్యారాజరాజేశ్వరీ దేవతా. ఐం కఏఈలహ్రీం. బీజం క్లీం హసకహలహ్రీం శక్తిః. సౌః. సకలహ్రీం. కీలకం. సౌభాగ్య విద్యారాజరాజేశ్వరీ ప్రసాద సిద్ధ్యర్థే జపేవినియోగః.

మూలేనషడంగన్యాస మరుణాం కరుణామితిధ్యానలమిత్యాది పంచపూజాం కుర్యాత్.

ఓం. హ్రీం. శ్రీం. ఐం కఏ ఈలహ్రీం క్లీం హసకహలహ్రీం. సౌః. సకలహ్రీం. ఇతియథాశక్తిర్మూలమంత్రంబుజపేల్.

౯ అస్య శ్రీసౌభాగ్యవిద్యా రాజరాజేశ్వరీ రహస్యస్తోత్ర మహామంత్రస్య బ్రహ్మఋషిః గాయత్రీఛందః. సౌభాగ్య విద్యారాజరాజేశ్వరీ దేవతా. ఐం కఏఈలహ్రీం బీజం. క్లీం హసకహలహ్రీం. శక్తిః, సౌః సకలహ్రీం కీలకం సౌభాగ్యవిద్యా రాజరాజేశ్వరీ ప్రసాదసిద్ధ్యర్థేజపేవినియోగః.

మూలేనషడంగన్యా సమరుణాం కరుణామితిధ్యా నలమిత్యాది [redacted]ర్యాత్.

ఇంద్రం మిత్రం వరుణ మగ్ని మాహురథో దివ్య స్సుపర్ణో గరుత్మాన్. ఏకం సద్విప్రా బహుధా వదంత్య గ్నిం యమం మాతరిశ్వానమాహుః.

౧౦ అస్యశ్రీసౌభాగ్య విద్యారాజరాజేశ్వరీ సూక్తమహామంత్రస్య బ్రహ్మాఋషిః. గాయత్రీఛందః. సౌభాగ్య విద్యారాజరాజేశ్వరీ దేవతా. ఐం. కఏఈలహ్రీం. బీజం. క్లీం హసకహలహ్రీం. శక్తిః సౌః సకలహ్రీం కీలకం. సౌభాగ్యవిద్యా రాజరాజేశ్వరీ ప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః.

మూలేనషడంగన్యాస మరుణాం కరుణామితిధ్యా నలమిత్యాది పంచపూజాం కుర్యాత్.

ఓం. ఐం. హ్రీం. శ్రీం. అహంబ్రహ్మాస్మి. ఐం కఏఈలహ్రీం ప్రజ్ఞానం బ్రహ్మ క్లీం హసకహలహ్రీం తత్త్వమసిసౌః సకలహ్రీం అయమాత్మాబ్రహ్మ. మిత్రస్య యోనిరసిపుత్రస్య నాభిరసి మాతాస్యాహిగ్ంసి మాహమా హిగ్ంసి. జాతవేదసేసునవామసో మమరాతీయతో నిద

హోతివేదః. సనఃపర్షదతిదుర్గాణి విశ్వానావేవసింధుందురి
తాత్యగ్నిః. తామగ్నివర్ణాం తపసాజ్వలంతీం వైరోచనీం
కర్మఫలేషుజుష్టాం. దుర్గాందేవిగ్ం శరణమహంప్రపద్యే
సుతరసితరసేనమః. అగ్నేత్వం పారయానవ్యో అస్మా
న్స్వస్తిభిరతి దుర్గాణివిశ్వా. పూశ్చపృథ్వీ బహులాన
ఉర్వీభవాతోకాయతనయాయశంయోః. విశ్వానినోదు
ర్గహాజాతవేద సింధుంననావాదురితాతిపర్షి. అగ్నేఅత్రి
వన్మనసాగృణానోస్మాకం బోధ్యవితాతనూనాం. పృత
నాజితగ్ం సహమానముగ్రమగ్నిగ్ం హువేమ పరమా
త్సధస్థాత్. సనః పర్షదతిదుర్గాణి విశ్వాక్షామద్దేవో అతి
దురితాత్యగ్నిః ప్రత్నోషికమీడ్యో అధ్వరేషు సనాశ్చ
హోతానవ్యశ్చసత్సి. స్వాఞ్చాగ్నే తనువంపి ప్రయస్వా
స్మభ్యఞ్చసౌ భగమాయజస్వ. గోభిర్జుష్ట మయుజోనిషి
క్తం తవేన్ద్ర విష్ణోరను సంచరేమ. నాకస్యపృష్ఠ మభిసం
వసానో వైష్ణవీంలోక ఇహమాదయంతాం. గౌరీమిమా
యసలిలాని తక్షత్యే కపదీద్విపదీసా చతుష్పదీ. అష్టాప
దీనవపదీ బభూవృషీ సహస్రాక్షరా పరమేవ్యోమన్. కా
త్యాయనాయవిద్మహే. కన్యకుమారిధీ మహితన్నో దు

గ్నిప్రచోదయాత్. సహస్రపరమా దేవి శతమూలాశతాం
కురా. సర్వగ్ం హరతుమేపాపందూర్వా దుస్స్వప్ననా
శనీ. కాండాత్కాండాత్ప్రరోహంతి పరుషః పరుషఃపరీ
ఏవానోదూర్వే ప్రతనుసహస్రేణ శతేనచ. యాశతేనప్ర
తనోషి సహస్రేణ విరోహసి. తస్యాస్తే దేవిష్టకే విధేమ
హవిషావయం. అశ్వక్రాంతే రథక్రాంతే విష్ణుక్రాంతే
వసుంధరా. శిరసాధారయిష్యామి రక్షస్వమాం పదేపదే
స్వాహా.

౧౧ అస్యశ్రీసౌభాగ్య విద్యారాజరాజేశ్వరీ ప్రస్థానత్ర
యమహామంత్రస్య బ్రహ్మాఋషిః గాయత్రీఛందః. సౌభా
గ్యవిద్యారాజరాజేశ్వరీ దేవతా. ఐం కఏఈలహ్రీం బీజం
క్లీం హసకహలహ్రీం. శక్తిః. సౌః. సకలహ్రీం. కీలకం
సౌభాగ్యవిద్యారాజరాజేశ్వరీ మంత్రార్థప్రకటనార్థేజపే
వినియోగః. మూలేనషడంగన్యాస మరుణాం కరుణామి
తిధ్యాన లమిత్యాది పంచపూజాం కుర్యాత్.

అగ్నిమీళే పురోహితం యజ్ఞస్యదేవమృత్విజం.
హోతారంరత్నధాతమం. ఇషేత్వోర్జేత్వా వాయవః దే
వోవస్సవితా ప్రార్పయతుశ్రేష్ఠ తమాయకర్మణ ఆప్యా

యద్ధ్వామఘ్నే యా దేవభాగ మూర్జస్వతీ పయస్వతీరనమీవా అయక్ష్మామావస్తేన ఈశతమాఘశగ్ం సోధ్మవా అస్మిన్ గోపతౌస్యాతబహ్వీర్యజ మానస్య పశూన్ పాహి. అగ్న ఆయాహివీత యే గృణానో హవ్యదాత యే. నిహోతాసత్సిబర్హిషి. త్వమగ్నే యజ్ఞానాం హోతావిశ్వేషాం హితః. దేవేభిర్మానుషేజనే. యేత్రిషప్తాః పరియాంతి విశ్వారూపాణి బిభ్రతః. వాచస్పతీర్బలా తేషాం తన్వో అద్యదధాతుమే. అథాతో బ్రహ్మ జిజ్ఞాసా. సర్వధర్మాన్ పరిత్యజ్యమా మేకం శరణంవ్రజ. అహంత్వా సర్వపాపేభ్యోమోక్ష ఇష్యామిమాశుచ.

అనేనజపేన సౌభాగ్యవిద్యారాజరాజేశ్వరీ సుప్రీతాసు ప్రసన్నవరదాభవతు.



# మహామంత్రార్థదీపిక.

ఓం. హ్రీం. శ్రీం. ఐం. కఏఈలహ్రీం. క్లీం హ సకహలహ్రీం సౌః సకలహ్రీం. అథర్వణ్యాం. త్రిపుర తాపిన్యుపనిషది ఓంకారేణప్రతిపాద్యం చిద్వస్త్వేవహ్రీం కారేణచిచ్ఛక్తి రితిప్రతిపాద్యతే. అతఏవత్రి శత్యామేకో న శతతమస్య నామ్నశ్చతుర్థ్యన్తోహ్రీం నమఇతి ప్రయోగః అపిచ భాసుర నందకృత సౌభాగ్య భాస్కరభాష్యాన్వితేలలితా సహస్రనామ. సూత్రభాష్యే చతుర్థశతక ప్రారంభేపి హ్రీం కారైక్యనమేవేతిదృశ్యతే. తచ్చిచ్ఛక్తిర్విజ్ఞానార్థమేవ ఋచస్సామానియజూగ్ంషి సాహిశ్రీరితి శ్రుత్యా. సాశ్రీవేదత్రయేణ ప్రతిపాదితాఽవస్త్వితిజ్ఞాయతే. సైవత్రిపాద్గాయత్రీవేద్యత్వేన ఐం. క్లీం. సౌః. ఇతిత్రిపురాభగవతీతివ్యాపశ్యతే. ఐం. క్లీం. సౌరితిసంపుటిత తద్గాయత్రీ ప్రకటనార్థమేవ గోపదబ్రాహ్మణాంతర్గతత్రిపురతాపిన్యుపనిషద్వాక్యైః పంచదశాక్షరీ శ్రీవిద్యాచేతిజ్ఞాపితా. తత్రత్రకూటత్రయాది వివేకా ఉపవిష్టాః. తదుపది

ష్ట్యకూటత్రయం మహావాక్య చతుష్టయతత్త్వమస్యాది
వాక్యవిషయే అభేద్యత్వం ప్రతిపాదితేతి శ్రూయతే. దు
ర్గాత్సంసార సంకటాత్తారయతీతి. దుర్గేతికథ్యతే. అగ్ని
వదింధనాని దహాతి సర్వకర్మాణీతి అగ్నిదుర్గా వేద్యా సై
వకామమృత్యుదాహీ కాత్ర్యంబకవిద్యా ఏవమాదిమప్ర
కారైః బ్రహ్మవిద్యైవ పరదేవతా. త్రిపురాభగవతీ స్వ
రూపప్రకటనార్థత్వేనోక్తాః తత్తత్కలాశ్చ దర్శితాః వి
ద్యాప్రతిపత్తయే మంత్రాశ్చనిరుక్తాః విద్యాష్టకం వ్యా
ఖ్యాయ తదధిష్ఠానజ్ఞాపనాయ శ్రీచక్రం వ్యాఖ్యాతం తత్త
ద్విజ్ఞానేన దురితక్షయవిద్యోత్పత్తిద్వారా అమృతత్వప్రా
ప్తిరామ్నాయతే. ఉపనిషదియం శాక్తాద్వైతేతాత్పర్య
వతీత్యవగమ్యతే తురీయ్యావిద్యేతి.

ఆంధ్రార్థము

ఓం. హ్రీం. శ్రీం. ఐం. కఏలఈలహ్రీం. క్లీం.
హసకహలహ్రీం. సౌః. సకలహ్రీం అథర్వణ వేదమం
దున్న త్రిపురతాపియను ఉపనిషత్తునందు ఓంకారముచే
తత్ప్రతిపాదింపబడిన చిత్ యనువస్తువే హ్రీంకారముచేత
చిచ్ఛక్తియని ప్రతిపాదింపబడుచున్నది. గనుకనే త్రిశ

తాయను గ్రంథమందు నూటపదితొమ్మిదవ నామమైనచ తుర్థీవిభక్తితో కూడిన హ్రీం. నమయను ప్రయోగము కనబడుచున్నది. మఱియు భాసురానందులవారిచేరచింపబడిన సౌభాగ్యభాస్కరభాష్యమందుండిన లలితాసహస్రనామ సూత్రభాష్యమందు నాల్గవశతికము మొదటియందు హ్రీంకార్యైనమయను చతుర్థీ విభక్తిగల వాక్యము జూపట్టుచున్నది. అచిచ్ఛక్తిని గుర్తెఱుగుకొఱకే ఋచస్సామానియజూగంషి సాహిశ్రీః యనుశ్రుతిచేత ఆ శ్రీ. మూడు వేదములచేత ప్రతిపాదింపబడిన వస్తువని తెలియబడుచున్నది. అచిచ్ఛక్తియే మూడుపాదములతో కూడినగాయత్రీగుఱుతుచేత ఐం. క్లీం. సౌః. యని త్రిపురాభగవతియని పఠింపబడుచున్నది. ఐం. క్లీం. సౌః. యని సంపుటముచేయబడిన నాగాయత్రిని తెలుపుటకొఱకే గోపథబ్రాహ్మణాంతర్గత త్రిపురతాపియను ఉపనిషత్తురొక్కవాక్యములచేత పంచదశాక్షరీ శ్రీవిద్యాయని తెలియబడుచున్నది. దానియందు మూడుకూటములు మొదలుగాగల జ్ఞానముబోధింపుచున్నది. అలా ఉపదేశింపదగిన కూటత్రయము మహావాక్య చతుష్టయమైన తత్త్వమసి

మొదలుగాగల వాక్యవిషయమందు భేదింప శక్యముగా
కుండుటను ప్రతిపాదించుచున్నదని వినబడుచున్నది. సం
సారసంకటమువల్లనుంచి తరింపజేయుచున్నది గనుక దుర్గ
యనిచెప్పబడుచున్నది. అగ్ని కట్టెలనుదహింపజేసినట్లు
సకలకర్మలను దహింప జేయుచున్నదికాగా అగ్ని దుర్గ
యని గుర్తెఱుగదగియున్నది. అచిచ్ఛక్తియే కోరికలను
మరణమును దహింపజేయుచున్న త్ర్యంబకవిద్యా యీ
మొదలుగాగల ప్రకారములచేత బ్రహ్మవిద్యయే పరదేవ
తయైన త్రిపురాభగవతి స్వరూపమును తెలుపుటచేత చె
ప్పబడుచున్నది. ఆయాకళలున్ను జూపట్టుచున్నవి. వి
ద్యాజ్ఞానముకొఱకు మంత్రములు నియమింపబడినవి. వి
ద్యాష్టకమును వ్యాఖ్యానముచేసి ఆశ్రీవిద్యను తెలియపర
చుకొఱకే శ్రీచక్రమువ్యాఖ్యానము చేయిబడినది. ఆయా
విశిష్టమైన జ్ఞానముచేత పాపనాశన విద్యోత్పత్తి మూల
కముగా మోక్షప్రాప్తి ప్రతిపాదింపబడుచున్నది. యీఉ
పనిషత్తుశక్తి సంబంధమైన అద్వైతమందు తాత్పర్య మ
గుచున్నదనిన్ని నాల్గవవిద్యయనిన్ని తెలియదగినది.

స్వస్తిశ్రీమదఖండ భూమండలాలంకారేత్యాది స

కలబిరుదావళీ విరాజమాన శ్రీమదాత్మానంద సదాశివ బ్రహ్మేంద్రసరస్వతీస్వామి నాం ప్రియతమాంతేవాసి వర్య గోపాలసచ్చిదానంద బ్రహ్మేంద్ర సర్వతీస్వాములచే జె ప్పబడునదెద్దియన్న ను సగంహితావాక్యమగు ఓమనఃప్రణవాక్షరమున్నా బ్రాహ్మణవాక్యములగు కఏఈలహ్రీం హసకహలహ్రీం సకలహ్రీం యనునీసగంహితాబ్రాహ్మణవాక్యములు రెండునుగూడి మంత్రబ్రాహ్మణయోర్వేద నామధేయమను కల్పసూత్రాను సారముగా మంత్రబ్రాహ్మణముల రెండిటియొక్క కూడికకే వేదమనుసాంజ్ఞబొందుటచే సగంహితా బ్రాహ్మణరూపమగు యీవేదమంత్రమైన ఓం హ్రీం శ్రీం ఐం కఏఈలహ్రీం క్లీంహసకహలహ్రీం సౌః సకలహ్రీంయను నీమంత్రమును సదాపరోక్షజ్ఞానసిద్ధికొరకు జపించుచు అపరోక్ష సాక్షాత్కారముకొరకు విచారించతగియున్నది.

శ్రీమత్పరమహంస,

స్వామి. జీ. యస్. బి. సరస్వతి.

